మద్రాసు ప్రభుత్వపు ప్రచురణ—8. సొసైటీ ప్రచురణ—9.

# పెద్దల కథలు

## STORIES FOR ADULTS

ది సౌత్ ఇండియన్ ఎడల్ట్ ఎడ్యుకేషన్
కో-ఆపరేటివ్ పబ్లిషింగ్ సొసైటీ, లిమిటెడ్.,
2/21, ఫస్టులైన్ బీచ్ : : మద్రాసు—1.
టెలిఫోన్ నెం. 3879

# సోమరుల రాజ్యం

అదొక చిన్న రాజ్యము. ఆ రాజ్యములోని జనాభా ఆరే ఆరువేలు. అందున్న భూములను అప్పటి జనులకు పంచిపెట్టిన ఒక్కొక్కరికి ఒక యెకరాయైనా వచ్చునో రాదో? అనగ అది యొకరాజ్యము. అందులకే దానిని చిన్న రాజ్యమన్నది. ఆ రాజ్యమున కొక రాజు. అతనికొక మంత్రి, సేనాధిపతి, సిబ్బంది, కచేరి, కోర్టు మున్నగునవి కూడ కలవు. సైన్యము పెద్దది కాదు. సైనికులంతా ఒక వందమంది వుందురేమో? 'పిండి కొలది రొట్టె' యన్నట్లు ఆ రాజ్యమునకు రాబడికూడ తక్కువే. కర్చు యెక్కువ. లోటును సరిచేయ వలయును కదా! ఎట్లు? పన్నులను హెచ్చించుటొక మార్గము. పన్నులు హెచ్చించిన భరించు వారుండవలదా? ఈవిషయమున రాజునకు చింత మెండా యెను. పొగాకు, కల్లు, సారాయి, జూదములు మున్నగు వానిపై యెక్కువ పన్నువేసిన తప్పులేదు. రాబడి విషయ మెట్లున్నను దురభ్యాసములు తుదముట్టి రాజ్యము బాగు పడును. చుట్ట, బీడి, సిగరెట్టులు కాల్చుట, మద్యపానము చేయుట, జూదమాడుట యన్న జనులకు చాల యిష్టము. ధర్మరాజువంటివాడు జూదమాడి రాజ్యమును పోగొట్టుకొన లేదా? దురభ్యాసమా! నీ మహిమ కనుగొనుట మానవుని

తరము కాదు. సాలెపురుగు యీగలను తనగూటిలోని కీడ్చునట్లు నీ వందరినీ తుద ముట్టింతువు కదా! జనులను దారిద్ర్యము చేతను, దుఃఖము చేతను పీడింతువు కదా! నలుగురిలో తల యెత్తుకొని తిరుగ లేక ఆత్మహత్య చేసి కొన్న వారెందరు ?

పాపము ! ఆ చిన్న రాజ్యములో త్రాగుడు జూదములు ప్రారంభమైనవి. తప్పత్రాగి, మన్ను మిన్నెరుగక, పడుచు లేచుచు పోవువారు కొందరు; ఇండ్లకు పోయి, భార్యా బిడ్డలను చావమోది, తాముసు చచ్చి చెడువారు మరి కొందరు; జూదములాడి సమస్తమును పోగొట్టుకొని "అన్నమో రామచంద్రా !" అని అల్లాడు వారును ఆ రాజ్యమున నుండిరి. అచ్చట దుర్మార్గములు మెండాయెను.

రాజధాని ముఖ్య పట్టణములో ఒక ఖూనీ జరిగెను. పోలీసువారు ఖూనీ చేసిన వానిని జైలులో నుంచిరి. కోర్టు విచారణ కావలసి యుండెను. కోర్టునిండా జనము చేరిరి. న్యాయమూర్తి, విచారణ చేయుట కొక కుర్చీపై కూర్చొని యుండెను. ఆయనకు యిరుప్రక్కల బిళ్ళ బంట్రోతులు నిల్చొని యుండిరి. కొంచెము క్రిందుగా గుమాస్తా యొకడు రికార్డులను సర్దిపెట్టుకొను చుండెను. చక్రగోష్ఠి లాగ వకీళ్ళు కూర్చొని యుండిరి. విచారణను వినుటకుగాను చాలమంది జనులు వచ్చియుండిరి.

అపరాధిని పోలీసువారు పిల్చుకొనివచ్చి బోనులో నెక్కించిరి. దుష్టునికి దండము కావలెనని కొందరు, అమాయకుని పోలీసువారు పితలాటకము పెట్టి పట్టుకొని వచ్చినారని కొందరు, యిట్లెన్నో విధముల జను లనుకొన సాగిరి.

గవర్నమెంటు వకీలు కేసు నంతయు జడ్జిగారి యెదుట సంగ్రహముగా తెలుపుకొనెను. ఇండియన్ పీనల్‌కోడ్ 411 సెక్షన్‌ప్రకారము వానికి 'ఉరిశిక్ష' అవసర మని ఆయన వాదించెను. జడ్జీ, జూరీవారి అభిప్రాయమును గూడ తెలిసికొని, వానికి ఉరిశిక్ష విధించెను.

జడ్జీగారిచ్చిన తీర్పును రాజుగా రామోదించిరి. అంతా బాగుగనే యున్నది కాని ఒక చమత్కారము. మున్నెన్న డును యిట్టి నేరమెరుగని రాజ్యములో 'తలదీయు' యంత్ర మెక్కడినుండి రావలయును ?

ప్రక్కనున్న రాజ్యమువారి నడిగిరి. వారు యంత్ర మును దాని పనివానిని పంపుటకు మూడువే లడిగిరి. "నేర స్తుని తల అంత ఖరీదగునా ? రాజ్యపు ఆదాయములో సగము వీనితలకే పాడుచేయవలెనా ?" అని రాజున కాలో చన కలిగెను. మంత్రియు నట్లే ఆలోచించెను. ఇదంతా యెందుకని నేరస్తునికి 'ఉరిశిక్ష' మార్చి జన్మాంతపు ఖైదు వేసిరి. వాని భార్య ముత్తైదువ తనము గట్టిగా నున్నం దున యిట్లు జరిగినది.

•

ఆ రాజ్యములో జైల్లేదు. అప్పుడొకటి కట్టించి, ఖైదీని పోషించుటకు సంవత్సరమునకు సాలునకు వెయ్యి రూపాయ లగునని అంచనావేసిరి. ఇది జనులమీద భారము వేసినట్లని రాజాలోచించెను. కావున నేరస్తుని రాజ్యము విడిచి పొమ్మని ఉత్తరువు చేసెను. నేరస్తుడు "రాజా! నే నెక్కడికి పోవలయును? ఒక కాసైనను సంపాదించు కొను యోగ్యత నాయందులేకుండ నన్నింతకాలము పోషించి సోమరిగా చేసితిరి. కూర్చున్నదగ్గరే నా కన్న పానీయములు దొరకుచున్నవి. ఈ అపరాధ మెవ్వరిది?" అని అడిగెను.

రాజునకు ఆలోచన హెచ్చెను. వెయ్యి రూపాయ లిచ్చి వానిని రాజ్యము వదలి పొమ్మనెను.

వెయ్యి రూపాయలు తీసికొని నేరస్తుడు దగ్గర నున్న పల్లెకుపోయి, భూమిని యెల్లను కొనెను. సేద్యము చేసికొనుచుండి వాడు కొంతకాలమునకు మంచి ఆసామి ఆయెను. వాని విషయము విన్న రాజు తన రాజ్యములో అంతటి ఆసామి ఒకడైనా లేకపోయె గదా యని చింతించెను.

# ఆశపోతు కామయ్య

దృశ్యము : కామయ్య గృహము

(తన ఇంటి ముందరి అరుగుపై కూర్చొని)

కామయ్య :- అబ్బా! ఇప్పటికి పలుకుబడిగల ఒక భూస్వామి నైతిని. పాముకు పామే కరచె నన్నట్లు త్రాగుడే వానిని తుద ముట్టించెను. ఆభీమన్న ఆస్తి అంతయు నాదేకదా! ఎనిమిది యెద్దులు, ఇరువది యెకరముల భూమి, ఇద్దరు పనివాండ్రు, ఆవులు, గేదెలు, అన్నియు నావే. పాలు, పెరుగు, వెన్న, నెయ్యికి కొరత లేదు. ఇక నాతో సరితూగు వారెవరు? ఇదియు చాలదు. ఈ యూరికెల్ల నేనొక్కడనే కుబేరుడని పేరు పొందవలయు.

త్యాగయ్య :- (ప్రవేశించి) అయ్యా! ఈ రాత్రి నన్నిచ్చట పడుండ నిచ్చెదరా?

కామయ్య :- రండి: కూర్చోండి. తమ దేయూరు?

త్యాగయ్య :- నాది భాగ్యం పల్లె.

కామయ్య :- పేరు చాల బాగున్నది. అయ్యా! అక్కడ భూము లున్నవా? వానలు సకాలములో కురియునా? పైర్లు బాగా పండునా?

త్యాగయ్య :- భూముల కేమిలెండి. కావలసినన్ని. సాగు బడికి రైతాంగములేక భూములు కొన్ని బీడుపడి యున్నవి. సకాల వర్షములుండి యేమి ప్రయోజ జనము? కొన్ని బంగారు పండించే భూములుకూడ. ఒకనెల క్రితము యెవరో మా పల్లెకు వచ్చి యుండిరి. కాని వారికి అదృష్ట మున్నట్లు లేదు. వారు కుక్క సంతకు పోయినట్లు వెనుకకు తిరిగి వెళ్ళిరి. మీ రేమో భాగ్యవంతులని........ప్రయత్న పడరాదా ?

కామయ్య :- ఈ విషయము మరెవ్వరికైన చెప్పితిరా ?

త్యాగయ్య :- లేదు. నేను వచ్చుట మొదట మీ యింటికే కదా. దేవుడు నన్నెందుకో తొలుత మీ యింటికే పంపెను.

కామయ్య :- అయ్యా ! భోజనమునకు లెండు. కాళ్ళు కడుగు కొనుడు.

త్యాగయ్య :- సంతోషము. దానికేమి లెండి. నాకు పిడికె డన్నమే చాలును.

కామయ్య :- బిడియపడక నెమ్మదిగా భోజనము చేయండి. పదార్థము లెట్లున్నవో ?

త్యాగయ్య :- ఏమీ పరవాలేదండీ. దేవుడిచ్చినదే మహా ప్రసాదము.

కామయ్య :- (రాత్రి భోజనమైన తరువాత తనలో తానిట్లు యోచించును.) ఈ గ్రామము నా తాత ముత్తాతలు కట్టించినది కాదు గదా ! ఎక్కడైనా సరే ఆదాయము రావడమే ప్రధానము. ఈ యూరు యెందుకు విడిచి పోరాదు? ప్రయత్నమే పురుషుల లక్షణము. అది యటుండ నిమ్ము. ఇంక నీ యూరిలో వుంటే లాభము లేదు. నన్ను చూచిన రైతుల కసూయ. అసూయ, అనుమానము లుండుచోట నుండతగదు. ఎంత త్వరగా జారుకొన్న అంత మేలు. నా భూములను అమ్మి వేసెదను. గొడ్డు గోదను కూడ అలాగె చేసెదను. అంతగా కావలసివస్తే అక్కడ దొరకవా యేమి ? ఆ యూరు గొడ్డు పోయినదా ? బాగుపడే యోగముంటే యెక్కడైన సరే. అక్కడికే వెళ్ళి లాభమువచ్చే మార్గము చూచెదను.

(అనుకొన్నట్లే చేసి పెండ్లాము బిడ్డలతో త్యాగయ్య చెప్పిన ఊరు చేరును. దాని పేరు భాగ్యంపల్లె కాదు. నడిమి దొడ్డి.)

నడిమి దొడ్డిలో నుండి కాపురము చేయుచు, ఆ యూరి రెడ్డి సహాయమున భూమి పుట్ర సంపాదించుకొని, కావలసిన ధాన్యము పండించు కొనుచు కాలము

గడుపుచుండును. కొంత కాలమునకు హైదరాబాదు నుండి కాందిశీకులు కొంద రాయూరు చేరుదురు. ఆ యూరి రెడ్డి వారందరకును భూము లిప్పించి కామయ్యకు సహాయము చేసినట్లే వారికిని తోడ్పడును. కామయ్యకు రెడ్డినుండి సహాయము తగ్గిపోగా, బుద్ధిమంతుడగు కామయ్య నడిమి దొడ్డిని విడిచి, త్యాగయ్య చెప్పిన భాగ్యంపల్లె యెక్కడ నున్నదో వెదకికొని అక్కడికే పోదా మనుకొనును.

(నడిమి దొడ్డిలో కామయ్య యిల్లు)

భోగయ్య :- (ప్రవేశించి) సాహుకారుగారికి వందనములు.

కామయ్య :- నమస్కారము. 'సాహుకారు' అని అని పించు కొనునంతటి అదృష్టవంతుడనా ! పదివేల రూపాయల ఆస్తి ఉన్నమాత్రాన సాహుకారినైతే కోటి రూపాయల ఆస్తిపరుడేమి కావలె ?

భోగయ్య :- మా భాగ్యంపల్లెకు వచ్చిన కోటి రూపాయల ఆస్తిపరు లగుదురేమో ఎవరు చూచారు ?

కామయ్య :- (తనలో) భాగ్యంపల్లెయా ? త్యాగయ్య చెప్పిన ఊరు అదే అయి యుండునా ? (పెద్దగా) త్యాగయ్య మీ యూరి వాడేనా ?

భోగయ్య :- అవును. త్యాగయ్య మా యూరు విడిచి పెట్టిన తరువాత అది బాగు పడింది. బీదవారన్న

మాటయే లేదు. భూములు బీడుపడి యున్నవి దున్ను వారు లేక.

కామయ్య :- అట్టైన భాగ్యంపల్లెకు వత్తునా ?

భోగయ్య :- అవశ్యముగా.

కామయ్య :- ఆ యూరెక్కడ నున్నది ?

భోగయ్య :- ఇక్కడికి నేరుగా పశ్చిమమున నున్నది.

కామయ్య :- సముద్ర తీరముననా ?

భోగయ్య :- అవును. సముద్రమతి గంభీరము. రత్నములకు నిలయము. దానిని చూచుటకు మన| రెండు కన్నులు చాలవు.

కామయ్య :- భూములు.

భోగయ్య :- వాటికేమి కొరవండి. వేయి రూపాయలకు కనీసము రెండువందల యెకరాలు దొరకును.మీరు నావెంట వచ్చినను సరే. మీకై మీరు బయలుదేరి వచ్చినను సరే. నేను సెలవు తీసికొందును.

(అని చెప్పి వెళ్ళిపోవును)

సేవకుని ఒకనిని వెంటగొని, కావలసినంత పైకముతో కామయ్య, భాగ్యంపల్లెను చేరుటకై పడమటి దిక్కున పోవుచుండును. ఎన్నో నదులను, గ్రామములను

దాటి పోయినను భాగ్యంపల్లె మాట వినబడదు. పడమటి కనుమలను చూచి "దట్టమైన అడవులవి. పోవు టెట్లు ? దుష్టజంతువు లిచ్చట నుండునుగదా. నేను వానికి బలి యగుదునా ? అల్లదిగో లోయ. లోయలో ఫలవృక్షము లవిగో. పూతీగెలు వానిని ఆలింగనము చేయుచున్నవి. ఏమిశోభ ! ఘురఘురమని చప్పుడు చేయుచు పారునవి సెలయేళ్లుకదా. భాగ్యం పల్లెమాట యెట్లున్నను, నాకన్నుల భాగ్యము ఫలించినది" అనుకొని దారిని పోవుచుండును. కొంతదూరము నడువగా కొన్నిగుడిసెలను చూచి భాగ్యం పల్లె యదియే కాబోలునని సంతోషించును.

అందొక గుడిసె చేరబోగా స్త్రీ యొకతె కామయ్యను చూచి ఒక విధమైన కూత కూయును. ఆ పల్లె వారందరు కామయ్యను ఆయన సేవకుని చుట్టుకొందురు. అందు వెక్కిరించువారు కొందరు. చూచి దూరముగ పోవువారు కొందరు. ఇది చూచిన కామయ్య కేమియు తోచలేదు. ఆ పల్లె యజమానుడు "మీయూరేది?" అని కామయ్య నడుగును. కామయ్యకది క్రొత్తభాషయగుటచే అర్థము కాలేదు. కాని తూర్పుదిక్కును చూపును. అంతట వారు ఒక గుడిసె ముందర కంబడిని పరచి, త్రాగుటకు పాలును, వేసికొనుటకు తాంబూలమును తెచ్చిపెట్టుదురు. వారు చేసిన మర్యాదకు కామయ్య మిక్కిలి సంతోషించు చుండ కొంత తెలుగు తెలిసిన వాడొకడువచ్చి---

"ఎందుకు వచ్చింది?" అని అడిగెను, తదుపరి యీ యిరువురి మధ్య దిగువమాటలు నడచెను.

కామయ్య:—ఇది భాగ్యంపల్లెయా ?

తె. తె:—భాగ్యంపల్లె....కు....పో-వు దా....రి.

కామయ్య:—(తనలో) అబ్బా ! వచ్చిపడితిని. ఇక నా అదృష్టమునకు మేరయేలేదు.

(బిగ్గరగా)

ఏమండీ ! భూముల వెలయెంత ?

తె. తె:—ఒకదినమునకు నూరురూపాయలు.

కామయ్య:—ఎన్ని యెకరములు ?

తె. తె:—అదంతా మాకు తెలియదు; సూర్యుడు పుట్టి పొయ్యేదాక యెంతనడుస్తావో అంతా నీదే. నూరు రూపాయలు.

కామయ్య:—ఒకదినములో చాల భూమి చుట్టి తిరిగిరా వచ్చునే. ఇక పదిదినములకు వెయ్యి రూపాయలు సెలవుచేసిన యెన్నో యెకరముల భూమివచ్చును.

తె. తె:—ముందుచెప్పండి.

కామయ్య:—అలాగే (అని నూరురూపాయ లిచ్చును). ఇక నడువవచ్చునా ?

తె. తె:—ఆహా !

కామయ్య:—(నడుచుచు) పచ్చని బయళ్లు; నిండిన చెరువులు; అదృష్టము బాగున్నది. కాలము వృథా పుచ్చరాదు. (ఇంతలో నడిజాముకాగా యెండ యెక్కువగును.) అక్కడి భూములకంటె యివి సారవంతములు. ఇవిబాగులేవు. అక్కడికి పోయెదను. (అనుచు చాలదూరము నడచి భూముల మీది ఆశతో పరుగెత్త నారంభించును.) పరుగెత్తి చాలా అలసితిని. సుమారైదున్నర గంటలై యుండవచ్చును. (అని తిరిగిచూడ వానికంటికి గుడిసెల జాడయే కానరాకుండును.) అయ్యో ! సూర్యుడు అస్తమించువేళకు అక్కడకు పోనిచో నూరు రూపాయలు నష్టమగునే ! ఏమిచేయుదును ? పరుగెత్తెదను. (రాలు రప్పలపై నడచుటచేతను, గుట్టలెక్కి సెలయేళ్లు దాటుటచేతను కామయ్యకు బడలిక కల్గును. ముండ్లు గ్రుచ్చుకొని కాళ్లలో రక్తము వచ్చుచుండును. కండ్లకు చీకట్లు కమ్మును. ఎట్లో తంటాలు ప డు చూ, ప డు చూ, లే చు చూ, సొక్కుచూ, త్రుళ్ళుచూ, గుడిసెల కొంకమైలు దూరాన నిలిచిపోవును. పల్లెవా రాతనిని చూచి సైగలతో వేగముగ రమ్మందురు. తత్తరపడుచు ప్రాణముల మీద ఆశ విడిచి) బ్రతుకుదునా ?

భూముల ననుభవించు అదృష్టము కలదా ? (అని తలయెత్తి చూచుచు పరుగులెత్తును.)

ఊరుచేరి క్రిందపడును. పడినదానితో సరి. అతని అసువు లెచ్చటికేగెనో?.... అది భాగ్యంపల్లెకాదు. పాపంపల్లె.

ఆ పల్లెవారు వచ్చిచూతురు. అయ్యో ! అని అందురు. సేవకుడు కండ్లనీరుగార్చుచు, పామయ్యను, భూమిని త్రవ్వి పూడ్చి పెట్టును. "ఇంత ప్రయాసము ఈ ఆరడుగుల భూమికై కదా ! దురాశ దుఃఖముచేటు కదా. ఆశ కంత్యమెక్కడ ? అయ్యో ! దేవుడిచ్చిన దానితో తృప్తిపడి యుండిన యెంతహాయిగ నుండును ! అందరు భాగ్యంపల్లె చేరుదురా?" అనుచు సేవకుడు తన యూరికి వెళ్ళును.

# భూతదయ

(భార్యను బిడ్డను పోగొట్టుకొని దుఃఖసముద్రములో మునిగియున్న రాజారావుగారి యింటికి వినాయకరావు వస్తాడు.)

వినాయకరావు:—(రాజారావుతో) ఏమండీ! రాజారావు గారూ! తమరీ తీరున దుఃఖించడం న్యాయమా? లోకానుభవము గల్గిన తమరే యీ తీరున ప్రవర్తించిన యిక యితరుల నేమనవలె? అంతయు తెలిసి అడవిన బడుతున్నారే.

రాజారావు:—మీరు చెప్పేది నిజమే. కాని యీ పాడు జన్మ యెందుకెత్తినామాయని అనిపిస్తుంది నాకు:

వినాయకరావు:—మానవజన్మము మాధవుని సేవతోగాని సార్థకము కాదు. ఆయనను నమ్మి చెడినవారు లేరు.

రాజారావు:—మాధవసేవ చేయుటకు తత్త్వోపదేశ మవసరముకదా!

వినాయకరావు:—కాని మాధవసేవకు సులభమైన మార్గము మానవసేవ. మానవసేవ చేయుచు భాగవతాది గ్రంథపఠనము చేసిన మరింతమేలు. ఇంతకును మనస్సు కుదుట పరచుకొనవలె.

రాజారావు:—అనుభవము గలవారి మాటలు అమృత తుల్యములు గావా !

II

(వానలో తడిసి వణకుచు, చిన్నిబాలు నెత్తికొని అనాధ హరిజన స్త్రీ యొక్కతె వస్తుంది.)

"తనయం దునఖిలభూతములందు నొకభంగి సమహితత్త్వంబున జరుగువాడు"అని పాడుచు రాజారావు వాకిట నిలుచును.

రాజారావు:—(తలుపులుతీసి) తల్లీ ! లోపలికి రా! వానలో తడిసినట్లున్నావు. చలిగాలి వీచుచున్నది. చంటి బాలుడేడ్చుచున్నాడు. రాతల్లీ లోనికి.

స్త్రీ!—ఈ జన్మలో తమబోటి బ్రాహ్మణుల యిండ్లలో ప్రవేశించుటకు నేను నోచుకోలేదండీ బాబయ్యా !

రాజారావు:—నీ వెవరమ్మా? నీయూరేది ?

స్త్రీ:—నేనొక అనాధను. హరిజన కులానికి జెందినదానను.

రాజారావు:—అయిన నేమమ్మా. నాకు జాతి, మత, కుల భేదములు లేవు. అందరూ నాయింటికి స్వేచ్ఛగా రావచ్చును. ఇక్కడ ఆతిథ్యమందరకు సమానమే బిడ్డా ! నన్ను నీతండ్రివలె యెంచుకొనుము. తడిగుడ్డల తీసివేయుము. ఈ పొడిగుడ్డను ధరించుము. బాలుని దేహము తుడువుము. పాలిమ్ము. ఉయ్యా

లను గట్టెదను. అందు బాలుని నిద్రపుచ్చుము. నీవు లోనికి వెళ్లి అన్నము తినుము.

స్త్రీ:—స్వామీ! మిమ్ము చూడ భగవానుని దర్శనమైనట్లైనది. నేను ధన్యురాలనైతిని. అక్కరకు వచ్చిన వాడుకదా చుట్టము. మ్రొక్కిన వరమిచ్చినకదా దైవము.

(అనాథస్త్రీ భోజనము చేయుచుండ)

రాజారావు:—చీచీ! చిట్టిపాప! (అని ఉయ్యాలలోని బిడ్డను ముద్దిడుకొనును.)

స్త్రీ:—(లోనుండి వచ్చి సాష్టాంగపడి) ఆర్యా! వందనములు. తమ ఋణము తీర్చుకోలేను. తమరు గాంధి అవతారముగా నాకు కనిపిస్తున్నారు.

రాజారావు:—అమ్మా! గాంధి గారెక్కడ నేనెక్కడ? నక్కయెక్కడ నాకలోకమెక్కడ? నావిధిని నేను చేసినాను. దీనికింత పొగడ్తతో పనిలేదు. సరేకాని నీ యీదుస్థితికి కారణమేమమ్మా?

స్త్రీ:—గడచిన ప్రపంచ యుద్ధంలో నాభర్త మిలిటరీలో చేరినాడు. ఇంతవరకు ఆయనజాడ తెలియలేదు. ఆయన యుద్ధమునకు పోవునపుడిచ్చిన డబ్బంతయు కర్చయిపోయినది. తరువాత ఈ పాడు

పొట్టకై ఒంటిదాననై ఒక ఆసామియింట పనికి కుదిరితిని. నాకు కనేదినములు రాగానే పనిచేయ లేకపోతిని. అంత ఆ యింటివారు దయమాలి నన్ను పొమ్మనిరి. ఆస్పత్రిలోనుండి నేనీబాలుని కంటిని. ఎచ్చటనైన పనికి కుదురుదమని యెంత ప్రయత్నము చేసినా, "రేపురా, మాపురా" అని చెప్పువారేగాని నన్ను జేర్చుకొనువారు లేకపోయిరి. పైగా నేను హరిజన కులమునకు చెందినదాన నగుటచే కొందరునన్ను యేపనికిని రానియ్యరైరి. నా జన్మ నాకే కష్టమనిపించినది. అన్నములేక మూడు దినములుగా కాలము గడిపితిని. బావియో, చెరువో చూచుకొందమని కూడ యోచించితిని. కడకు దేవుడు నన్ను మీదరికి చేర్చినాడు.

రాజారావు:— అయ్యో ! అట్లెందుకమ్మా ! ఆత్మహత్య యెన్నటికిని కూడదు. "బ్రతికియున్న సుఖములు పడయవచ్చును."

స్త్రీ:— అయితే నాకు బ్రతుకు తెరువు ?

రా:—పుట్టించినవాడన్నము పెట్టించకపోడు. నారుపోసిన వాడు నీరుపోయడా ?

స్త్రీ:—ఎట్లు ?

రా:—అమ్మా! ఇచ్చటికి అరమైలులోగా అనాథ శరణాలయ మొకటి యున్నది. అచ్చటికి పొమ్ము. ఈ చీటిని చూపుము. నీకు కావలసిన సహాయము దొరకును. నీభర్త విషయముకూడ త్వరలోనే తెలిసికొందువు. నీ కర్చునకుగాను ఈ అయిదు రూపాయలను ఉంచుకో. పోయిరా. (అయిదు రూపాయలను ఆమె కిచ్చును.)

(స్త్రీ వెడలిపోయినది.)

రా:—(భక్తిపరవశుడై) ఈమె శ్రీహరియై యుండవచ్చునా? ఆశ్చర్యము! వండిన వంట వండినట్లేయున్నది. కొంచెమైనను తగ్గలేదు. ఏమి యీమాయ? ధన్యుడను ధన్యుడను! దేవా! నాసేవను నీవు గ్రహించితివా? అతిథిరూపమున నన్ను దయ చూచితివా?

"అచ్యుతా, గోవిందా, ముకుందా, మురారే"

(అని భగవన్నామ కీర్తన చేయును.)

# జొన్నగింజ కథ

సూర్యుడు పడమటి దిక్కున మునుగుట కింకను ఒక గంట కాలముండును. ఒక పెద్ద మైదానములో బాలురు ఆడుకొనుచుందురు. అప్పుడు ఒక బాలునికి కోడి గ్రుడ్డంత : గింజ యొకటి దొరకును. అది జొన్నగింజ. "నాకునాకు ! ఏది నాకుచూపవు. ఇటుతే చూస్తామ"ని ఆ గింజకొరకు బాలురందరు తమ ఆటలు మాని గింజు లాడుదురు. గలభా యెక్కువగును. ఆ సమయమున గుర్రమును స్వారిచేయుచు పోవుచున్న జమీందారొకడు అదంతా చూచి ఆశ్చర్యంతో గుర్రము నాపి, వారియొద్దకు పోయి గింజను చూచును. ఆశ్చర్యపడును. గింజనుంచు కొన్న బాలునికి ఒక రూపాయిని చేతిలోపెట్టి ఆగింజను తీసుకొని 'గుర్రమునెక్కి తనదారిన పోవును.

హంపీనగరము. ఆనాడు మహర్నవమి. శ్రీకృష్ణ దేవరాయలు సింహాసనముపై కూర్చుండి దర్బారు జరుపు చుండును. ఆయన కుడిప్రక్క అప్పాజీ (తిమ్మరుసు మంత్రి) కూర్చుండి జరుగు కార్యక్రమమును శాంతముగా చూచుచుండును. సామంతరాజులు తండోపతండములుగ వచ్చి రాయలవారికి కానుకలిచ్చుచుందురు. • ఆ సభలో

నున్న జమీందారుడును తాను రూపాయనిచ్చి కొనితెచ్చిన జొన్న గింజను రాయలకిచ్చును. సభికులు పక్కుమని నవ్వెదురు. కొందరు "బాగుంది ఇదేమి కానుక" యనియు మరికొందరు "రాయలకీ పండుగ దినమున దీనినా కానుక యివ్వవలసిన" దనియు. ఇంకా కొందరు "ఏమి యీ అవి వేకము! చాలు చాలు" అనియు ఆక్షేపణగా పలుకుదురు. రాయలు మాత్రము ఆ గింజను ఆశ్చర్యముతో చూచు చునే యుండి ఒకమారు అప్పాజీవైపు చూచును. గ్రహిం పుగల తిమ్మరుసు సభవైపుకు తిరిగి "సామంతులారా! మీ నవ్వులో అర్థము కొంచెముకూడలేదు. ఇది సాటిలేని కానుక. దీనిని మీరు తక్కువగా చూడగూడదు. దీని నిచ్చినవారికి నిండు తెలివి యున్నది. ఇట్టి కానుకలే రాయలవారికి కావలసినవి. చాలింపుడు మీ ఆక్షేపణలు" అని పల్కును.

రాయలవారు జమీందారుని చూచి "మీరిచ్చిన కానుక వెలలేనిది. అది యెచ్చటిది? మీకెట్లువచ్చినది? దీని విష యమై మీకేమైన తెలియునా?" అని ప్రశ్నించును.

జమీందారు "మహాప్రభో! గడచిన నెల నేనొక పల్లెనుండి నాయూరికి వచ్చుచుంటిని. సాయంకాలము ఊరిబయటనున్న మైదానములో బాలురు కొందరాడుకొను చుండిరి. అందొక బాలునకీ గింజ దొరకగా మిగిలిన

వారందఱు వానిచుట్టుమూగి దానికై పెనగులాడు చుండిరి. నేనదిచూచి అచ్చటకు వెళ్ళి యీ గింజను ఒకరూపాయకు కొంటిని. దీనిని సాటిలేని తమరికి సాటిలేని కానుకగా యిచ్చితిని. అనుగ్రహింపుడు''అని మనవిచేయును.

అనంతరము అచటనున్నవారిమధ్య

దిగువ సంభాషణము జరుగును

రాయలు:—ఏపల్లె దగ్గర మీరీగింజను కొంటిరి ?

జమీందారు:—శిరిపురము.

మంత్రి:—ఏ శిరిపురము ?

జమీందారు:—ఇక్కడికి రెండు క్రోసుల దూరమున నుండునది.

రాయలు:—ఇట్టి గింజను మీరిదివరకెన్నడైన చూచియున్నారా ? లేక విన్నారా ?

జమీందారు:—రాజాధిరాజా ! నేను చూడనూలేదు. విననూ లేదు.

రాయలు:—ఈ గింజ విషయమై ఎవరికి తెలిసియుండవచ్చును ?

జమీందారు:—ప్రభూ! శిరిపురములో యెవడో బెనకప్ప యట. ముసలివాడట. వానికి తెలియునట.

మంత్రి:—ఎవరచ్చట? తక్షణమే ఆ బెనకప్పను పిలుచుకొని రండు.

(పిలుచుకొని వచ్చుటకై సేవకుడు పోవును.)

శ్రీ రాయలవారు సభలో నుండగా బెనకప్ప వచ్చును. అతని వయస్సు 60 సంవత్సరము లుండ వచ్చును. అతనికి కండ్లంతగా కనుపడవు. ఊతకోలలపై భారము వేసి నడచుచుండును.

బెనకప్ప:—దేవరవారికి వందనములు.

రాయలు:—బెనకప్పగారూ! ఇది యేగింజ? మీరు రైతులు కదా! ఇట్టిధాన్యమును కని, విని యుంటిరా? పండించి యుంటిరా?

బెనకప్ప:—ప్రభో! నేను వ్యవసాయదారుడనే. ఇట్టి ధాన్యమును పండించి యుండలేదు. కాని ఆ విషయమై విన్నాను.

రాయలు:—ఎవరినుండి?

బెనకప్ప:—మా తండ్రిగారి నుండి.

రాయలు:—మీతండ్రిగారెవరు ? వారి నిచ్చటికి పిలుచు
కొని రాగలరా ?

బెనకప్ప:—చిత్తము ప్రభూ !

౪

బెనకప్ప తండ్రి శంకరప్ప వయస్సు యెనభై సంవత్సరములు. అతనికి కండ్లు కొంతకొంత కనబడు చుండును. అతడొక ఊతకోల సహాయమున సభలో ప్రవేశించి,

శంకరప్ప!—రాజాధిరాజులకు వందనములు.

రాయలు:—శంకరప్పగారూ ! రండి. కూర్చోండి. ఈ
గింజను చూడండి. ఇట్టి గింజను మీరు పండించి
నారా ? చూచినారా లేక విన్నారా ?

శంకరప్ప:— ప్రభూ ! నేను జొన్నలను పండించి
యున్నాను గాని యిట్టిది కానము. నేను పండించిన
ధాన్యపు గింజలు యీ గింజకు సగపాటివే. కాని
మా తండ్రిగారు వారికాలములో పండించెడి వార
మని చెప్పెడివారు. వారి నడిగిన ఆ సమాచార
మంతయు తెలియును.

రాయలు:—ధన్యుడను. నారాజ్యములో నింకను నిట్టివారు

బ్రతికి యుండుట నా అదృష్టము. శంకరప్పగారూ! బండిలో వారిని తీసుకొని వచ్చెదరా ?

శంకరప్ప:—బండి యెందులకు ప్రభూ ! వారు నడచి రాగలరు.

రాయలు:—వారివయస్సు ?

శంకరప్ప:—నిండు నూరు సంవత్సరములు.

రాయలు:—కండ్లు కనుపడునా ?

శంకరప్ప: –బాగుగ.

౫

(శంకరప్ప తండ్రి కిట్టప్ప సభకు వచ్చును. అత డాజాను బాహుండు. కండ పుష్టి కలవాడు. మంచి పొడవరి)

కిట్టప్ప:—మూరురాయరగండా ! మీకు వందనములు.

రాయలు:—మంచిది మీకు స్వాగతము. కూర్చొని యీ గింజను చూడుడు. మీరిట్టి గింజలను పండించి యుంటిరా ?

కిట్టప్ప:—(సంతోషముతో కన్నీరు కార్చుచు) నాతల్లీ ! జొన్నమ్మా! ఎన్నాళ్ళకమ్మా నిన్ను మరల చూచి నది (అని అనుచు దానిని నోటవేసుకొని నమలి చ్ చ్ అని రుచిని తెలియ జేయును.)

రాయలు:- బాగుబాగు! ఈ జొన్నగింజ విషయము చెప్పలేదే?

కిట్టప్ప:-మహారాజా! ఇట్టిదానిని నేను పండించుచుంటిని. తిను చుంటిని. తినుచు నేటికిని యిట్లున్నాను.

రాయలు:- మీదేయూరు? ఏసీమ?

కిట్టప్ప:-మహాప్రభూ! మీ శిరిపురమే. ఈ బళ్లారి సీమకు చెందిన రాయలవారి రాజ్యము లోనిదే.

రాయలు:-తాతా మీకు నిండు నూరేండ్లున్నను బాగుగ నడువగలరు. చూడగలరు. పండ్లును గట్టిగా నున్న ట్లున్నవి. మాతాత ముత్తాతలను చూచిన పుణ్యా త్ములు మీరు. మా సందెహములను దీర్చెదరా?

కిట్టప్ప:-సంతోషము.

రాయలు:-మీకంటె చిన్నవాడైనను మీ కొడుకునకు కండ్లం తగా కనుపడవు. ఆయన ఊతగోలను ఎందుకు ఉపయోగించ వలయును? మీ మనుమ డన్ననో మీ యిద్దరికంటె చిన్న వాడైనను దృష్టి లోపము కలిగి నడువ లేకున్నాడేల?

కిట్టప్ప:-రాజా! రానురాను కాలమహిమచే జనులు దుర్బలు లగుచున్నారు.

రాయలు:-దీనికి కారణము?

కిట్టప్ప:-మహీపాలా! నేను పగలంతయు కష్టపడి పని చేయుచుంటిని. కడుపార జొన్నరొట్టె, పండించిన కూరగాయలు, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి తినుచుంటిని. మాతుంగమ్మ యిచ్చు మంచినీరు తప్ప నేను వేరుపానీయము పుచ్చుకొనను. డంబములేని జీవనము చేయుచుంటిని. ఇతరులను గౌరవించి వారినుండి తగు గౌరవమునకు పాత్రుడ నగుచుంటిని. నాకొడుకునకు నా అలవాటులు కొన్ని తప్పిపోయినందులకే ఆతడు నాకన్నను బలహీనుడు. వాని కన్నను వాని కొడుకు బల హీనుడు.

రాయలు:-అలవాటు లెట్టివి?

కిట్టప్ప:-సొంత సేద్య మున్నవారికి సంపద యెక్కువ. కృషికునకు దుర్భిక్ష ముండునా! పరులు చేసిన పని పాడు.

రాయలు:-బాగుగ చెప్పితిరి. సోమరితనము సేద్యమును పాడుచేయు చున్నది. భోగములు భాగ్యమును నశింపజేయుచున్నవి. కామములు కొంపల కాల్చి వేయు చున్నవి. తాతా! ఇంకేమైన చెప్పగలరా?

కిట్టప్ప:— పాతకాలమే మంచికాలము. "గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్" అని వినియుండ లేదా ప్రభూ !

రాయలు:—తాతా నిన్ను చూచి నేను చాల సంతోష పడు చున్నాను. ఈ వెయ్యిన్ని నూటపదార్లను బహు మానముగా పొందుము. మీరు మారాజ్యమున నుండువరకు జీతబత్తెముల నిచ్చి మీరే మాతాత యని మిమ్ములను సాకుచుందును. సామంతు లారా ! నవ్వి మీ తొందరపాటును చూపితిరి. అది గొప్ప పొరబాటు. వింటిరా ఆ గింజమహిమ. అట్టిగింజలను పండించి యీ మా తాతలే దేశకల్యా ణమునకు తోడ్పడినవారు.

మన ప్రజలందరకును శుభమగుగాక !

(అని సభను చాలించును)

వయోజనులు చదువుకోడానికి

# మదరాసుప్రభుత్వమువారి ప్రచురణలు

౧. కామయ్యకథ
౨. మర్యాదరామన్న – అప్పాజీ
3. సత్యప్రియత్వము – గాంధీమహాత్ముడు
౪. అబ్రహాం లింకను
౫. విద్యలోని విలువ
౬. మనదేశం
౭. మనశరీరము, ఇతరసంగతులు
౮. పెద్దల కథలు
౯. మన మతం

దొరకుచోట్లు

ది సౌత్ ఇండియన్ ఎడల్ట్ ఎడ్యుకేషన్
కో – ఆపరేటివ్ పబ్లిషింగ్ సొసైటీ, లిమిటెడ్.,
2/21, ఫస్టులైన్ బీచ్, మద్రాసు–1.

గ్రంథాలయ పుస్తకశాల
పటమటపోస్టు, కృష్ణాజిల్లా.

